అప్పుడే సమాధానము లభించును. ఇట్లొనరింపనిచో నిటునటు భ్రమింపవలసివచ్చును. ౧౩ మాయను దాటుటకొఱకీశ్వరుఁ డనేకములగు నుపాయములను నిర్మించెను. ప్రతీతిపూర్వకమగు నధ్యాత్మశ్రవణమార్గమువలననే పరమాత్మను బ్రాప్తింపఁగల్గుదురు. ౧౪ ఇట్లు గావింపనిచో లోకమునందంతటను మఱుపు కలుగును. సత్యాసత్యదశను గుర్తింపవలెను. ౧౫ అసత్యమార్గమునఁ బోవఁదగదు. అనృతవాదులతోఁ జెలిమి చేయరాదు. తనయందేమాత్రమైనను గృత్రిమ ముంచుకొనరాదు. ౧౬ కృత్రిమ మెన్నఁటికైనఁ గృత్రిమమే. సత్యమందుఁ గృత్రిమము నిలువఁజాలదు. తన యధోముఖ మానసమును (మాయవైపున కరుగు హృదయమును) ఊర్ధ్వముగ నొనరింపవలెను. ౧౭ అధ్యాత్మశ్రవణము గావించుచుండవలెను. ఇట్లు చేయుచున్నచో నంతయు లభించును. నానావిధజాలములు తెగిపోవును. ౧౮ చిక్కులుపడిన దారమును సరిగఁ దీయునట్లు మనస్సును సరిపఱచి యనుకూలము గావింపవలెను. మఱియు మెల్లమెల్లఁగా మూలపురుషుఁడగు పరబ్రహ్మము ప్రక్కకు మనస్సును సంధింపఁజేయవలెను ౧౯ ఈసృష్టియంతయుఁ గర్దమరూపము. ఆకర్దమము నానాప్రకారములగు శరీరములయందు విభ్రాజితమై యున్నది ౨౦ చూడవలసినదానినెల్ల నీశరీరమునందే చూడవలెను. ఇదియేమి? ఇదియెట్టిది? అనుదాని నిందే శోధింపవలెను. మఱియు మూలమాయ యొక్క పదునాలుగునామములను దీనియందే తెలిసికొనవలెను, ౨౧ నిర్గుణ నిర్వికార మొకటియే యన్నితావులందును వ్యాపకమైయున్నది. ఆ నిష్కళంక మీదేహమునందున్నదో లేదో చూడవలెను. ౨౨ సంకల్పరూపమగు మూలమాయ యంతఃకరణస్వరూపము. జడమునకుఁ జేతనము నొసంగెడి చైతన్యరూపముగూడ శరీరమునం దున్నది. ౨౩ సమానగుణములుగలుగుట (ఈశరీరముయొక్క) గుణసామ్యము. మఱియు సూక్ష్మవిచారము అగమ్యము. సూక్ష్మము నెఱుంగుసాధుపురుషు లందఱకును బ్రణామములు ౨౪ వామాంగము, దక్షిణాంగము అనునవి శరీరమునందలి రెండుభాగములు. దీనినే పిండమునందలి యర్ధనారీనటేశ్వరునిగ నెఱుంగవలెను. ౨౫ ప్రకృతిపురుషులు, శివభక్తులు, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు భగవంతుఁడుగూడ నదియే ౨౬ దానినే మహత్తత్త్వ మందురు. త్రిగుణ

ముల గూఢత్వము దానియందే గలదు. అర్థమాత్రయు, శుద్ధసత్వము ను గుణక్షోభిణియు నదియే! ౨౭ త్రిగుణమువలన శరీరము ప్రవర్తించుట ప్రత్యక్షవిషయమేగదా! సరియే చాలును. మూలమాయాశరీరముగూడ నిట్టిదియే! కర్దమరూపమని యెఱుంగవలెను. ౨౮ మనస్సు, మాయ, జీవుఁడు, శరీరమునందు స్వాభావికముగనే యున్నది. ఈవిధముగాఁ బడు నాలుగునామములయభిప్రాయము బిండమునందు గ్రహింపవలెను. ౨౯ పిండము పతనమైనంతన యంతయు వెడలిపోవును. కాని పరబ్రహ్మము మాత్రము శేషించియుండును. దానినే శాశ్వతమని తెలిసికొని గ్రహింప వలెను. ౩౦



పదియవ సమాసము

పూర్ణ బ్రహ్మ నిరూపణము.

పరబ్రహ్మమును బట్టుకొనఁజాలము. పారవేయఁజాలము. అదియన్ని తావులందును బూర్ణముగ నున్నది ౧ ఎటుజూచిన నది యటు నిలిచియున్నది. దానికి మనము విముఖులము కాఁదలంచినను నదిమాత్ర ము సమ్ముఖముననే యుండును, మీరేమైనఁజేయుఁడు. అదిసమ్ముఖముగుట తొలంగిపోఁజాలదు. ౨ కూర్చున్నమనుజుఁ డొకవేళ లేచిపోయినను అక్కడఁగూడ నాకాశముండును. మీరేదికుకునైనఁ జూడుఁడు. నిరంతర మాకాశము సమ్ముఖముగనే యుండును ౩ మనుజుఁ డెక్కడికిఁ బారిపోయినను నాకాశము వానికి నలుదిక్కుల న మ రి యే యుం డు ను, ఎంతబల ముపయోగించినను మీరాకాశమును దాటిపోఁజాలరు. ౪ మీరెచటనైనజూడుఁడు. ఆకాశమెదురుగనేయుండును. రెండుజాముల వేళ సూర్యునివలె నాకాశము మస్తకముపైననే యుండును ౫ కాని సూర్యుఁ డేకదేశీయము. పరబ్రహ్మమున కాదృష్టాంతము మన్వయింపదు. ఇచట వినోదార్థ మాదృష్టాంతము నిచ్చితిని ౬ అనేకతీర్థములు, నానావిథదేశములు జూడవలయునన్న మిగులఁ గష్టపడి పోవలెను. కాని పరబ్రహ్మముకొఱ కంతకష్టపడి పోవఁబనిలేదు. అది మన మెచ్చటగూర్చుండియుంటిమో యచ్చటనే సిద్ధముగా నున్నది. ౭ మీరొక్కతావుననే కూర్చుండి యుండుఁడు లేదా పరుగెత్తుచుఁ దిరుగుఁడు. కాని వాస్తవమునకుఁ బరబ్ర

హ్మము మీావెంటనే యున్నది. ౮ ఆకాశమునం దెగురుచున్న పక్షి కెటుజూచిన నటు ఆకాశమే గాన్పించుచు. ఇగేవిధముగా మీారును బర బ్రహ్మమునం దున్నారు. ౯ పరబ్రహ్మము పూర్ణముగను సఘనముగను నిండియున్నది. అది యంత్యమునకుఁగూడ నంత్యము. నిరంతర మది యండటియొద్దను నమరియున్నది. ౧౦ దృశ్యమునకు లోపలను వెలుప లను బరబ్రహ్మము వ్యాప్తమైయున్నది. అది బ్రహ్మాండముయొక్క యు దరమున నిండియున్నది. ఓరీ! ఆవిమలమును దేనితో నుపమింపనగును? ౧౧ వైకుంఠమునందును, కైలాసమునందును, రుద్రలోకమునందును స్వర్గలోకమునందును, బదునాలుగు లోకములందును, మఱియుఁ బాతాళ లోకమునందును నది నిండియున్నది. ౧౨ కాశిమొదలు రామేశ్వరము పఱకు నది భరతఖండమునందంతటను నపారముగ నిండియున్నది. దీని కిటుప్రక్కను దానికటుప్రక్కను నింక నెంతావున నైనను బరంపరగఁ జూ డుము. కాని పరబ్రహ్మమునకుఁ బారావారము (అంతు) లేదు. ౧౩ ఏక దేశమగు నాపరబ్రహ్మ మొక్కమాఱుగా నంతటిని వ్యాప్తిగావించుకొ నెను. మఱియు నది యన్నింటిని నన్నిస్థలములందును స్పృశించుచున్నది. ౧౪ పరబ్రహ్మము వానకుఁ దడియదు. బురదలోఁ గూరుకొనిపోదు. ప్రవాహతీరముననున్నను నందుఁ గొట్టుకొనిపోదుగని ముందువెనుకలను, కుడియెడమలను, క్రిందమీాఁదను నది సమానరూపముతో నన్నింటియం దును వ్యాప్తమైయున్నది ౧౫ ఆకాశము జలాశయమున నిండియున్నది. అది యెప్పుడును దరుగదు. నలుదిక్కుల నది యపారముగా వ్యాపించి యున్నది. ౧౬ కాని యాకాశ మేకదేశీయమును శూన్యాకారమును నైయున్నది. ఆపరబ్రహ్మమునందన్ననో దృశ్యభాసము లేనేలేదు. అది నిరాభాసము ౧౭ సత్పురుషులు, సాధువులు, మహానుభావులు, దేవతలు, దానవులు, మానవులు మున్నగు వారలరందఱికిని బ్రహ్మ మొక్కటియే విశ్రాంతిస్థలము ౧౮ దానియంత్య మేపైపునఁ గను గొనవగును? దేనికిఁ బారావారము (అంత్యము) లేదో దానిమర్యాద యెట్లు నిశ్చితము గావింపనగును? ౨౦ పరబ్రహ్మము స్థూలముకాదు. సూక్ష్మముగాదు. దేనితోనేని సమానమైనదియుఁ గాదు. జ్ఞానదృష్టికిఁ దప్ప (దానివిషయమున) సమాధానమే లేదు. ౨౧ పిండబ్రహ్మాండము

లు నిరసనమైనపిదప నిరాభాసబ్రహ్మ మొక్కటియే గలదు. ఇక్కడి నుండి యక్కడిదనుక అవకాశమే యవకాశముగ వ్యాపించియున్నది. ౨౨ బ్రహ్మము వ్యాపకమైయున్నస్థితి సత్యమే! కాని యీవిషయములు (మాటలు) దృశ్య మున్నంతమట్టునకే యుండును. దృశ్యమే లేకపోయి నచో (వ్యాప్యము=దృశ్యము లేనిది) వ్యాపకమని యెట్లు నుడువఁగలము? ౨౩ కావున బ్రహ్మమునందు శబ్ద మంటఁజాలదు. కల్పన కచ్చటివనుక నడకయే లేదు. ఆకల్పనాతీతమగు నిరంజన పరబ్రహ్మమును వివేకముతో గుర్తెఱుంగవలెను ౨౪.

శుద్ధము, సారము నగుదానిని శ్రవణము గావించుటవలనను, శుద్ధము ప్రత్యయాత్మికము నగుదానిని మననముగావించుటవలనను విజ్ఞాన ప్రాప్తిమైనంతన స్వాభావికముగనే మనస్సు లయమగును. (ఉన్మనీదశ కలుగును) ౨౫ (ఇప్పటికి) సాధనఫలము లభించెను. సంసారము (ప్రపంచము) సఫలమయ్యెను. నిశ్చలము, నిర్గుణము నగు బ్రహ్మము అంతఃకరణమునం దావరించెను ౨౬ మాయయొక్క లెక్కలపుస్తకము ముగిసినది. పంచభూతము లనిర్వాకములైనవి. సాధ్యము సిద్ధించినది. కావున నింక సాధనము (నిలిచి) లేదు. ౨౭ స్వప్నములందుఁ గాంచినదెల్ల జాగ్రదవస్థలో నెగిరిపోయినది. కావున స్వాభావికముగనే యనిర్వాచ్యదశయే తెంచెను. ఇఁక జెప్పవలసిన యవసరము లేదు. ౨౮ దీనినంతను వివేకముచే నెఱుంగవలెను. ఆస్థితి ననుభవము గావింపవలెను. చాలును. దీనితో జన్మమృత్యుచక్రము నశించితీరును ౨౯.

భక్తాభిమానియగు దాశరథి నాయం దనుగ్రహము చూపినాఁడు. ఆసమర్థుని కృపావచనములే యీదాసబోధయం దున్నవి ౩౦ ఇరువది దశకములుగానున్న యీదాసబోధను శ్రవణమననములు గావించువానికి పరమార్థము ప్రాప్తించును. ౩౧ ఇందలి యిరువదిదశకములను (రెండు వందలసమాసములను) సాధకులు చక్కఁగ నధ్యయనము గావింపవలెను. మాటిమాటికి మననముగావించినచో దీనియందలి విశేషత్వము విశదమగును ౩౨ గ్రంథమును బ్రశంసచేయుట సహజము. కాని యట్లు ప్రశంసించుటవలన ప్రయోజనము లేదు. ఈగ్రంథముననున్నది యను

భవవిషయము. కావున అనుభవమునే గావించుకొనవలెను ౩౩ దేహము పంచభూతములది. దీనిలో కర్త యాత్మ. ఈస్థితిలో గ్రంథరచనము మనుజుని దెట్లుగును ? ౩౪ కావున నెప్పుడంతయు జగదీశ్వరుఁడే (కర్తయై) చేయుచున్నాఁడో యప్పుడు మఱల గ్రంథరచనము మనుష్య కృతమని చెప్పుటమిథ్య. ౩౫ సంపూర్ణదేహమునందలి యొక్కొక్క తత్త్వమును వేఱుగావింపుఁడు. ఏమియును శేషించియుండదు. ఆస్థితిలో మఱల నేపదార్థమును "మనది" యని యందము ? ౩౬ ఇవియన్నియు వివేకకార్యములు. కావున నీవిధముగనే భ్రమయుండఁ దగులొక్కని యుండఁదగదు. జగదీశ్వరుఁడే సమస్తమును రచించెను ౩౭.

స మా ప్తి.

శ్రీ రామదాసార్పణమస్తు.



1 వ పుటలో ముఖ్యదైవనుతావున ముఖ్యభక్తులనియు,

13 వ పుటలో జమయగుననుటకు జయమగుననియు,

90 వ పుటలో భక్తికలవాఁడనుటకు భక్తికల్గనివాఁడనియు

సవరించుకొనవలెను.

# కాకతీయ గ్రంథమాల

ప్రధానస్థలము వరంగల్. నైజాం. బ్రాంచి నందిగామ (కృష్ణా). ఆంధ్ర దేశమున సమగ్రమగు భాషాసేవజేసి జనసామాన్యమునకు విజ్ఞానము కలుగఁజేయ నుద్దేశించి యీ గ్రంథమాలను నెలకొల్పితిమి. ఇందు మొత్తమములగు గ్రంథములు సకాలమున సులభక్రయమునకుఁ బాఠకుల కందించెదము. మొదటి సంవత్సరము మూఁడుగ్రంథములను వెలువరించితిమి. 1. ఆంధ్రమంత్రులు. 2 విక్రమోర్వశీయము (ప్రబంధము) 3 వసుంధర (నవల).

మొదటి సంవత్సరపుఁ బ్రచురణములు మూఁడును ప్రవేశపురుసుముతోఁ గలిసి మాచందాదారులకు రు 3 లు. రెండవసంవత్సరపుఁ బ్రచురణ గ్రంథమగు దాసబోధ చందాదారులకు రు 4-0-0. ఇతరులకు రు 5-0-0 లు.

చందాదారులకు 100 పేజిలు 0-8-0 చొ॥ ఒసంగుదుము. రాజపోషకులచందా సం॥ రు 25-0-0. పోషకులు రు 12-0-0, సహాయుల చందా రు 6-0-0 లు మాత్రమే. ఈమూఁడుతరగతులవారిపేరులు మాగ్రంథములలోఁ బ్రచురింతుము.

గ్రంథమాల విషయమై ఉత్తరప్రత్యుత్తరములు సంపాదకులగు శేషాద్రి రమణకవులు, నందిగామ, కృష్ణాజిల్లా అను చిరునామకు జరుపఁగోరెదము.

ముందు సంవత్సరము వెలువడనున్న గ్రంథములు.

1. బర్మాదేశచరిత్రము. లాలా లజపతిరాయి గ్రంథమునకు ఆంధ్రానువాదము.
2. ఆంధ్రసామ్రాజ్యము. ఒరంగల్లురాజులచరిత్ర.ము
3. ప్రణయిని. అద్భుతకల్పనములు గల ఖండకావ్యము.

అనుబంధము

రుద్రదేవుని హనుమకొండ శాసనము.

## కాకతీయ గ్రంథమాలా పోషకవర్గము.

### రాజపోషకులు

1. రాజా శ్రీనాయని వేంకటరంగారావు బహద్దరువారు
మునగాల సంస్థానము, కృష్ణాజిల్లా.
2. కొలిపాక శ్రీరామరావుగారు, హైకోర్టువకీలు, హనుమకొండ.
3. శ్రీరాజా రాఘవరాజు వెంకటరామకృష్ణంరాజుగారు
నూగూరు స్టేటుజమీందారు.
4. మాదిరాజు రామకోటీశ్వరరావుగారు, హైకోర్టువకీలు, హనుమకొండ.
5. జములాపురము గోపాలరావుగారు, హైకోర్టువకీలు హనుమకొండ.
6. కాళ్లూరి రాజేశ్వరరావుగారు, జమీందారు, అమ్మసాలెము.
7. వరదారెడ్డి దేశముఖుగారు, తల్లంపాడు.
8. మహమ్మద్ అజంగోరీగారు, దేశముఖు, క్రొత్తపల్లి, పరకాలపోస్టు.
9. సి. వేంకటరావుగారు, సర్ దేశాయి సిరిసిల్లా.
10. గంగపల్లి వేంకటమాధవరావుగారు, జమీందారు, కందుకూరు.
11. మాదిరాజు వేంకటేశ్వరరావుపంతులుగారు,
వెంకటాపురం, వేంసూరుపోస్టు.

### పోషకులు

1. అక్కినేవల్లి జానకిరామరావుగారు (యావత్కాలపోషకులు)
జమీందారు, కొండగడప.
2. అమరము శివలింగయ్యగారు, సికిం ద్రాబాదు.
3. గుండవరం జగన్నాథరావుగారు, నరసింగాపురము.
4 డాక్టరు వెలిదిండ్ల రామమోహన్ రావుగారు హనుమకొండ.
5 డాక్టరు శివలెంక రామలింగయ్యగారు. ,,
6 కొండపల్లి గోపాలరావుగారు, వకీలు, ,,
7 పింగలి వెంకటరంగారావుగారు, హైకోర్టువకీలు. ,,
8 మెట్ట లక్ష్మీనరసయ్యగారు, హైకోర్టువకీలు, హైద్రాబాదు.
9 కఠారి రామచంద్రరావుగారు, రామవరము.
10 అన్నమనేని నరసింగారావుగారు, కనుపర్తి.

11 తక్కెళ్ళపల్లి ధర్మదొక్కా-రావుగారు, అక్కన్నపేట.
12 చిదిరేల రాజశేఖరముగారు, వరంగల్లు.
13 కొండపల్లి లక్ష్మీనరసింహారావుగారు, వకీలు, మధిర.
14 దేవులపల్లి వేంకటాచలపతిరావుగారు, వరంగల్లు.
15 తూము వరదరాజులు, వకీలు, వరంగల్లు.

అ భి మా ను లు.

1 తూము రంగయ్యగారు, వకీలు, వరంగల్లు.
2 మల్లెలజీడికంటి రామారావుగారు, రాయపర్తి.
3 ఐనవోలు సత్యనారాయణరావుగారు, ఐనవోలు.
4 కొండపల్లి సీతారాంరావు, వకీలు, హనుమకొండ.
5 తాడికొండ తిమ్మారెడ్డి దేశాయిగారు, తాడికొండ.
6 రాజా వేంకటేశ్వరరావు, బహద్దరువారు, దోమకొండస్టేటు.
7 వద్దిరాజు లక్ష్మీనరసింహారావుగారు, అలంకానిపేట.
8 నెల్లుట్ల నరసింహారావుగారు, కూనూరు.
9 కాశికంటి నారాయణరావుగారు, ముత్తెంపేట.
10 ముత్తినేని బుచ్చయ్యగారు, కేశవాపురము.
11 తన్నీరు వెంకటరామారావుగారు, పోతుగల్లు.
12 కలకొండ బుచ్చిరామారావుగారు, ఎర్రమద్ది.
13 నెల్లుట్ల కేశవరావుగారు, పెదపెండేల.
14 వద్దిరాజు సీతారామచంద్రరావుగారు, ఇనుగుర్తి.
15 నెల్లుట్ల తిరుమలరావుగారు, కూనూరు.
16 టి. చక్రపాణిగారు, వకీలు, వరంగల్లు.
17 పింగిలి వెంకటజోగారెడ్డిగారు, ధర్మవరము.
18 అయితా రామనాథముగారు, వరంగల్లు.
19 ముసిపట్ల పట్టాభిరామరావుగారు, తిరుమలగిరి.
20 వనం రాఘవరావుగారు, రాయపర్తి.
21 వనం నరసింహారావుగారు, గువ్వాలగూడెము.
22 కోగంటి నారాయణరావుగారు, ముత్తెంపేట.

# శేషాద్రిరమణకవుల గ్రంథములు.

## ఆంధ్ర మంత్రులు. వెల రు 0-12-0

విఖ్యాత కీర్తిసంపన్నులును, మహాత్ములును, ఉదారశీలురునగు తిక్కనసోమయాజి, బసవేశ్వరుఁడు, శీలము బ్రహ్మనాయకుఁడు మున్నగు వీరాధివీరులు మంత్రులుగనుండి ఆంధ్రదేశమునకుఁ గావించిన మహోప కారము, చూపిన అద్భుతపరాక్రమము మనోహరముగఁ జరిత్రానుకూలముగ వర్ణించు అద్భుత గ్రంథరాజము. మృదుమధుర పద్యములు పెక్కులుగలవు. ప్రత్యాంధ్రుఁడు జదివి ఆనందింపఁదగిన యుత్తమ గ్రంథము.

---

## 2 వసుంధర (నవల) రు 1-0-0

ఓరుగల్లురాజ్యమేలిన రుద్రదేవుఁడు వసుంధరను బెండ్లాడిన చరిత్రాత్మికకథ. ఆకాలపుఁబరిస్థితులు, శైవుల త్యాగము, జైనుల శాంతవ్రతము, ఆంధ్రవీరుల పరాక్రమజీవితము, ఆంధ్రసాధ్వుల పవిత్రాచరణము ఇందుఁ గనులఁగట్టును. ఇందలి భావగీతములు రసవత్తరములు. ఆంధ్రుల విక్రమముదెలుపు నవలలలో నిది అగ్రగణ్యము. మృదుమధురశైలి.

---

## 3 విక్రమోర్వశీయము ప్రబంధము రు 0-12-0

కాళిదాసమహాకవి వ్రాసిన సంస్కృతనాటకము ననుసరించి వ్రాయఁబడిన మైదాశ్వాసముల కావ్యము. ప్రతిపద్యము రసాస్పదము. మనోహరమగు శృంగారరసము. ప్రకృతివర్ణనలు చవులూరుచుండును. నూతన భావములు. రసవత్తరమగు శైలి. విపులమగు గ్రంథవిమర్శము గలదు. ఆధునికవాఙ్మయమున నిది మిగుల గణనీయమగు గ్రంథము.

---

## 4 పాపారాయనిర్యాణము (బొబ్బిలినాటకం) రు 1-0-0

ఇందలి ప్రతిపద్యము దేశభక్తి, మాతృదేశాభిమానము పురికొల్పును. కథాకల్పన మపూర్వము. ప్రదర్శనము కన్నివిధముల దగియున్నది. కథాంశము సత్యమగు చరిత్రము. వెలమవీరులత్యాగము, పాశ్చాత్యుల దుస్తంత్రములు, రాజభక్తుల పరాక్రమము ఆంధ్రసాధ్వుల విక్రమము ఈనాటకమున సమగ్రముగ వర్ణింపఁబడెను. ఆంధ్రదేశమునందలి రంగస్థలములన్నింటిలో నిందలి పద్యములు పఠనీయములుగ నున్నవి. విషాదాంతము.

---

## 5 నిజామురాష్ట్ర ప్రశంస వెల రు 0-8-0

నిజామురాష్ట్రములోని ఆంధ్రనగరములు శిల్పములు కవులు వీరచరిత్రములు దృశ్యములు ప్రకృతి వర్ణనములను వర్ణించు నూఱుపద్యములు. కొన్ని భావగీతములుగల చిత్రగ్రంథము. ఆంధ్రుల హృదయము నుఱ్ఱూఁత లూపు పద్యరత్నములు. అనుబంధము ఆంధ్రనగరముల ప్రశస్తిచరిత్రానుకూలముగఁ దెలుపు విషయ వివరణము గలదు. నిజాము రాష్ట్రమునందలి ఆంధ్రదేశచరిత్ర నెఱుంగువారలకు ఆంధ్రవ్యక్తిత్వము పై నభిమానముఁగలవారలకు నిది అవశ్య పఠనీయము.

---

## 6 భక్తవత్సలశతకము వెల రు 0-2-0

భగవంతుల సృష్టి నైపుణ్యము, ప్రకృతి సౌందర్యము వర్ణించు మృదు మధుర పద్యశతకము. అన్నిమతములవారి కనుకూలించును. ఆంధ్రదేశము నందంతటను బఠనీయముగ నాదరింపబడుచున్న యీశతకము ప్రత్యాంధ్రుఁడు చదివి తీరవలెను.

---

## 7 అర్జునపరాభవము (నాటకము) రు 0-12-0

మహారాష్ట్రవాఙ్మయమునఁగల చిత్రకథ ననుసరించి వ్రాయబడిన మనోహరమగు నాటకము. పాండవులగర్వ విజృంభణము, శ్రీకృష్ణుని కార్యకౌశలము, రాక్షసుల మాయానటన చాతుర్యము, భారతసంగ్రామానంతరమున ఆర్యావర్తస్థితి. ఇంక ననేక చిత్రకథాకల్పనములుగల నాటకము 60 ప్రతులె కలవు.

---

## 8 కాకతీయ సామ్రాజ్యము వెల రు 0-3-0

ఒరంగల్లు రాజ్యము పాలించిన కాకతీయరాజుల పరాక్రమము. మహమ్మదీయులదండయాత్రలు. ఓరుగల్లునగర ప్రాచీనవైభవము. ఆంధ్ర సామ్రాజ్యపతనము దెలుపు అద్భుతచరిత్రము. హృదయము కరఁగించు ఉద్రేకకరమగుశైలి. రెండవకూర్పు 60 ప్రతులుమాత్రమె కలవు.

---

## 9 ఆంధ్రవీరులు మొదటిభాగము 0-8-0
## రెండవభాగము 0-10-0

ఆంధ్రులలో వీరాధివీరులగు రాజులు, కవులు, మంత్రులు, భటులు మున్నగు వీరవతంసుల చరిత్రము లిందుఁగలవు. ఆంధ్రులచరిత్ర మీ గ్రంథములవలన సంపూర్ణముగఁ దెలియును. నవలలకు నాటకములకుపకరించు కథలిందెన్నియోగలవు. ఆంధ్రులీగ్రంథమును బఠించినచోఁ దాముత్తమోత్తమమగు వీరజాతిలో జనించినవారమని సగర్వముగఁ దలంపనగు నీరెండుభాగములు నిరంతర పఠనీయములు.

---

## 10 ఆంధ్రపదనిధానము 1-8-0

తూము రామదాసకవి ప్రణీతము. అమరమునుబోలిన తెనుఁగు నిఘంటువు. నేటివఱకు గ్రంథములైన తెనుఁగుపదములన్నియు నిందు సమకూర్పఁబడెను. 600 పుటలగ్రంథము. ప్రతిపద్యమునకు అర్థముగల

డు. అన్నివిధములనిది ఆంధ్రనామ సంగ్రహమును బోలి దానికి నాలుగు రెట్లుండును. శుద్ధాంధ్రపదము లాంధ్రదేశమున వాడుకలోఁగల వన్నియు నిందుగ్రంథస్థములయ్యెఁగాన భాషాస్వరూప మెఱుంగువారలకీగ్రంథ మత్యంతోపయోగకరము. నిఘంటువులలో నిట్టి సమగ్రగ్రంథ మింత దనుక ఆంధ్రమున బ్రకటింపఁబడలేదు. రెండుమూడు మాసములలో వెలువడఁగలదు.

---

## 11 దాసబోధ      వెల రు **5-0-0**

అత్యద్భుతమగు వేదాంతగ్రంథము. రాజకీయ రహస్యములు, నీతులు, సమయోచితధర్మములు, మానవుఁడు కడతేరువిధము మున్నగు నపూర్వాంశములు రెండువందలు చర్చింపఁబడినవి. ఈ గ్రంథరాజము శివాజిచక్రవర్తి గురువగు సమర్థ రామదాసస్వామి మహారాష్ట్రమున రచించినదాని కాంధ్రీకరణము. వేదాంతరహస్యములకు రాజకీయములకు నెలవగు నీ గ్రంథరాజము ఇంతవఱ కెన్నిభాషలలోనో యనువదింపఁబడి నది. ముద్రణము కాకముందె వందలకొలఁది ప్రతులకు ఆర్డరులు వచ్చినవి. దాదాపు 900 పుటలు. చిత్రపటములు. కాలికోబైండుగల గ్రంథము. మధురతరమగు వచనము గాన అందఱకు బాగుగా బోధయగును. ప్రత్యాంధ్రుఁడు చదువఁదగిన గ్రంథరాజము.

---

## ముద్రణమునందున్న గ్రంథములు

సర్వలోకేశ్వరశతకము. నీతిగీతావళి. ప్రస్తావనశ్లోక రత్నావళి. ఋతుసంహారము. ప్రణయిని. ఆంధ్రబ్రహ్మవైవర్తపురాణము మున్నగునవి.

చిరునామా:—

శేషాద్రిరమణకవులు, శతావధానులు,

నందిగామ, కృష్ణాజిల్లా.

---

# ప్రకటనము.

చరిత్రాంశములు, శాసనముల వృత్తాంతములు, ప్రాచీనకవుల గ్రంథములనుగూర్చిన విషయములు, గ్రంథపరిష్కరణము, గ్రంథముద్రణమునుగూర్చి విషయములు ఎఱుంగఁదలఁచువారికి ఉపయుక్తమగు ప్రత్యుత్తరములొసంగుదుము. నిజామురాష్ట్రీయులగు ఆంధ్రులకు వలయు పుస్తకములు సకాలమున కందింపఁగలము. బ్రిటిషుప్రాంతములలో నుండు ఆంధ్రులకు నిజామురాష్ట్రమునఁగల గ్రంథములు వలయుచో ప్రయత్నించి పంపఁగలము. ఈవిషయములు, ఇంకను నితరవాఙ్మయవిషయముల నెఱుంగఁగోరువారలు ఇట్లు వ్రాయనగును.

సంపాదకులు:—

కాకతీయగ్రంథమాల.

నందిగామ, కృష్ణాజిల్లా.

---

123

